# ఆత్మ జ్యోతి

( ఆధ్యాత్మిక సంపుటము )



రచన - జ్యోతి

వెల: 5-00

# ఆత్మజ్యోతి

(ఆధ్యాత్మిక దర్పణము)

రచన

జ్యోతి

వెల : 5-00

# ఒక మాట

ఈ వయస్సనేది మనకు తెలియకుండానే ఎలాగో గడచి పోతున్నది. శరీరం కూడ మనకు తెలియకుండానే మార్పులు చెందుతూ యున్నది అదే విధంగా మనస్సు. ఈ మనఃశరీర వయస్సులతో నిత్యం సంబంధం వుంచుకొని కూడా వాటి మార్పులను మనం తెలుసుకోజాలకున్నాము. అదే విధంగా మన పుట్టుక ఎందుకు తెలియదు. మరణం కూడా అంతే. మరణిస్తామని మనకు తెలుసు. కాని మనకు తెలియకుండానే మనం మరణిస్తాం. మనకు తెలియకుండ మనలను పుట్టించి, ఆడించి, గిట్టించే శక్తి ఏది ? ఇంతటి తెలివి తేటలున్న ఉత్తమ జీవిని యాంత్రికంగా నడిపించే శక్తి ఏది? అదియే ఆత్మ లేక మనస్సాక్షి అనబడును. ఆ శక్తిని ఆశ్రయించి శరణుపొంది, మనకు తెలిసే విధంగ మన యిష్టప్రకారంగ అన్ని కార్యములు జరుగునట్లు ఎందులకు ప్రయత్నించరాదు? ఆ శక్తిని పసిగొని తనదానినిగ చేసికొనుటకు చేయు ప్రయత్నమే ఆధ్యాత్మిక మనబడును.

ఈ ఆధ్యాత్మికంలో నిపుణతపొందినయెడల జననము కలదన్న సంశయమున్ను, సంసారమున బడి మునిగిపోయెదమన్న శంకయున్ను, మానావమానములు మొదలగువాని వలన కలిగెడి మనో వికారములును, కామక్రోధాది దుర్గుణములును, యోగధారణాది కష్టములును, అణిమాది సిద్ధులు లభ్యమగునన్న మోదమున్ను, మరణము కలదన్న భయమున్ను తొలగిపోయి వినిర్మల మౌననిష్టా గరితష్టత వలన కలిగెడి యిద మిద్దమని చెప్పలేని మహదానందము, శాశ్వతానందము, సంపూర్ణానందము కలుగును.

ఆత్మకు శరీరానికి మధ్య మనస్సున్నది. కోరికలు, వ్యసనాలు, బంధాలు మున్నగునవి మనస్సుకు బంత్రోతుల్లాంటివి. మనస్సు ఆత్మను అధిగమించి తన బంత్రోతులను శరీరంమీద ప్రయోగించి ఎటుపడితే అటు ప్రవర్తించేటట్లు చేస్తుంది. ఈ దృశ్య ప్రపంచాకిని కష్టనిష్ఠూరాలకు మనస్సే కారణం. ఈ మనస్సును అదుపులో పెట్టుకొన్న యెడల ఆత్మ

మనలను ఆదుకొంటుంది. ఎన్ని తీర్థయాత్రలు సలిపినను, దాన ధర్మములు చేసినను, పదవులలంకరించి పేరు ప్రతిష్ఠలు పొందినను, ఎన్ని విగ్రహా విగ్రహ ఆరాధనలు చేసినను ఏ దేవుడు ఆదుకోలేడు. నిన్ను నీవే కాపాడుకోవలయును. సుఖశాంతులు బడసేందుకు గాను మన ప్రవర్తన ఎప్పటికప్పుడు సమీక్షించుకోవాలి. మనలోనుండు అసుర స్వభావాలను ఒకేసారి విడిచిపెట్టుటగాని, ఒక్కొక్కదానిని క్రమంగ త్యజించుటగాని చేయాలి. మన నీడ మనలను వెంటాడేట్లు కర్మలు మనలను వెంబడించే ఉంటాయి. కావున ఎట్టి పనులు చేయుట వలన, ఎట్టి ప్రవర్తన కలిగి యుండుటవలన యీ జన్మలో సుఖించుటయేగాక రాబోవు జన్మలోకూడ దుఃఖములను కష్టములను పొందక క్రమ క్రమముగ ఉత్తమ స్థితికి వచ్చి అంత్యమున మోక్షమనే సమస్థితిని పొందుటకు తోడ్పడెడి సత్కార్యము లను చేయుచు, సత్ప్రవర్తనను కలిగియుండవలెనో తెలిసికొని వాటిని తూ. చ. తప్పక ఆచరించవలెను.

ఎందరో శ్రవణ, మనన, నిధి, ధ్యానములను చేయుచున్నారు. కాని వారికి ఆధ్యాత్మిక అవలంబన విధానం తెలియదు. చెప్పేవారు లేరు. అవధూతలు, సన్యాసులెందరికో వీరు సేవచేసియుందురు. కాని ఎవ్వరును వలానా వలానాయని చెప్పేవారు లేరు. పుణ్యంచేసేవారు గాని పుణ్యం చేసేదానికి శక్తిలేనివారుగాని, పుణ్యం అంటే ఏమో తెలియనివారికిగాని అందరికి అర్థం అయ్యేటట్లు అందుబాటులో యుండేటట్లు ఆధ్యాత్మికాన్ని ప్రవేశపెట్టాలి. ఆ సదుద్దేశంలో భాగంగా ఈ చిన్ని పొత్తము ఎంతైనా యుపయోగికారిగ నుండగలదను కుంటాను.

చిత్తూరు - 517 001,
తేది: 28–7–1981.

భవదీయుడు,
జ్యోతి



మనిషి భుజించు ఆహారము మూడు భాగములుగ నుండును. అదెట్లన కంటికి కనబడునది స్థూలమనియు, దాని యందిమిడి యుండు జిహ్వకు రుచిని కలిగించు రసము సూక్ష్మమనియు, అందుగల సత్తు అణువనియు చెప్పబడును. ఈ ఆహారము శరీరమునకు మదమును, బుద్ధికి నాలోచనా శక్తియు, మనస్సునకు దార్ఢ్యమును, కండరములకు చేతనాశక్తియు కలుగ జేయును. శరీరమున మద మధిక మైనపుడు పురుషునకు శుక్లమును, స్త్రీకి శోణితమును నేర్పడి స్త్రీ పురుషులు ఋతుకాలములో సంపర్కము చేసినపుడు శుక్ల శోణితము లొకేమారు కలిసి నప్పుడు యీ మిశ్రమము నీటిపై బుడగవలె స్త్రీ గర్భమున తేలియాడు చుండును. తరువాత పది దినములకు గడ్డకట్టి కోడి గ్రుడ్డు కంటె కొంచెము చిన్నదిగా నగును. ఇదియే పిండమన బడును. ఈపిండము ఒక నెలకు గట్టిపడి శిరస్సు ఏర్పడును. రెండవనెలలో అవయవములును, మూడవనెలలో కడుపును, నాల్గవనెలలో యిరు పార్శ్వములును, ఐదవనెలలో పాదములును వ్రేళ్ళను, ఆరవనెలలో ముక్కు చెవులు నేత్రములు మున్నగు జ్ఞానేంద్రియములు ఏర్పడును. ఏడవ మాసమున జీవుడనే గాలి ఈ తనువులో ప్రవేశించును. ఎనిమిది తొమ్మిదవ నెలలలో పూర్వ జన్మ జ్ఞానము కల్గి భూమిపై జన్మించు వరకు కామాగ్ని, క్రోధాగ్ని, జఠరాగ్నియని ప్రసిద్ధి కెక్కిన యగ్నిత్రయము చేత నిరంతరము మిక్కిలి వేగముగా క్రాగు చున్న మల మూత్ర రక్తములతోను, పురుగులతోను నిండుకొని దుర్గంధ మయమై మల మూత్ర స్థానమైన గర్భము నందుండి మల మూత్ర దుర్గంధములకు నసహ్యపడుచు, మావి యను పలుచని పొరచే గట్టుపడి, యిటు నటు తిరుగుటకు వీలుగాక నిట్టూర్పులు విడుచుచు సూతికా వాత వేగమున కోర్వలేక రోదనసేయుచు, తల్లి యొక్క అపాన వాయువు ఒత్తిడివల్లను, శిశువుయొక్క ప్రాణవాయువు ఒత్తిడి వల్లను గర్భము నుండి సంకట మార్గమున భూమిపై బడును. ఈ లాగున భూమిపై బడుట జన్మించుట యనబడును.

తరువాత పురిటింట వాసం, మల మూత్రములలోనే పరుండుట నుండి ఏ యొక్క దానికి అశక్తముగ పురుగువలె మెదలుచు నుండే జీవితం, ఈ దశలో మానాభిమానాలతో పనిలేదు. రోజులు గడవనూ గడవనూ కొంచెం కొంచెం పెరిగి

బాల్యావస్థ చేరడం. ఈ బాల్యావస్థలో అన్నీ వింతలే. ప్రపంచమే ఒక వింత, సంఘము, కట్టుబాట్లు, మాన మర్యాదలు, లౌకికం నేర్చుకోవడం మున్నగునవి ఈ దశలోనే. ప్రపంచం అర్థం అయ్యేది, మనో వికాసం కలిగేది యిప్పుడే. చూస్తూ చూస్తూ యుండగనే యౌవనం వస్తుంది. ఈ యౌవనంలో జీవి తన ప్రజ్ఞా పాటవంతో బుద్ధి చాతుర్యంతో కలుగు జేసుకొన్న బాధ్యతల్ని నిర్వర్తించేది, సాధక బాధకాలు పడేది, కామ క్రోధ లోభమోహ మద మాత్సర్యములకు లోబడి యుండేది. అనుకోకుండానే కౌమారం వస్తుంది. బాల్య దశలో ప్రపంచాన్ని అర్థం చేసుకొని జీవితగమ్యానికి పునాది రాళ్ళు వేసుకొంటే, కౌమారంలో గతించిన జీవిత మాధుర్యాన్ని, సాధక బాధకాలను, లాభ నష్టములను, గతంలో సాధించిన సాధించని వాటిని మననం చేసుకొని జీవిత గమ్యాన్ని, జీవిత లక్ష్యాన్ని నిర్ణయించు కొనేది. అంతలో వార్ధక్యం, వార్ధక్యం. పురిటిదశవలె నానాయాతనలతో కూడిన రోదన జీవితం. పురిటింట్లో శిశువును కనురెప్పవలె కాపాడు తారు. అదే శిశువువార్ధక్య దశకు వస్తే చీదరింపులు, ఏవగింపులు, గుర్తింపులేని జీవితం. తర్వాత ఎలాగూ మరణంతప్పదు. పుట్టిన ప్రతి జీవి చచ్చుట నిజం. వేయి సంవత్సరములు జీవించి యుండినను మృత్యువాతపడక తప్పించుకొనుటకు వీలులేదు. ఆదేవుడే అవతారా లెత్తిన కూడ చచ్చుట ఖాయం.

శరీర మనగా జీర్ణించునది. దేహమనగా దహింప బడునది. ఇటువంటి అస్థిరమైన అశాశ్వతమైన శరీరమును 'నేను నేను' యని వూగిస లాడెదరు. ఈ శరీర మెటు వంటిదో కొంత పరికింతము. ఇది తన అంగుళముచేత తొంబై యారు అంగుళముల ప్రమాణముండును. ఎనిమిది జానల పొడవు, నాల్గుజానల పలయము, ముప్పది మూడు కోట్లరోమ ద్వారములు, డెబ్బది రెండు వేల నరములు, అరువది తొమ్మిది కీళ్ళు, ముప్పది రెండు మూరల పెద్ద ప్రేగు, డెబ్బది పెద్ద ఎముకలు, ఎనిమిది పలాలగుండె, నాల్గు పలాల దుధిరము, మూడు వందల యిరువది పలముల మాంసము, సోలెడు పైత్యము, అరసోలెడు శ్లేష్మము, అరసోలెడు శుక్లశోణితము లతో నిండియుండి నడుముల దగ్గిర అతుకబడి యుండును. ఇంటికి కిటికీలు ద్వార బంధములువలె ఈ శరీరమునకు కండ్లు, చెవులు, ముక్కు, నోరు, గుదము ఉపస్థ మను ద్వారములు శరీరమునకుండును. ఈ దేహము పైకి సుందరముగా కనపడి

నను కంపు నీళ్ళతో, మల మూత్రములతో నిండియుండి మురికి ప్రేగులతో చుట్టబడి యుండును. ఇటు వంటి శరీరములో గాలి యనబడే జీవుడు ప్రవేశించి ముక్కు రంధ్రముల గుండ పూరక రేచకములు గను, మిగిలిన ఏడు ద్వారముల ద్వారా జీవికి తెలియ కుండు విధముగ నడయాడు చుండును ఈ యొక్కగాలి ముక్కు రంధ్రముల గుండ నడయాడక నిలిచిపోయినచో ఈ శరీరము పీనుగ యనబడును, నిష్ప్రయోజనమగును. కాటికి ప్రయాణము చేయును. మట్టి పాలగును. అంత వరకు ఈ దేహము నంటి పెట్టుకొని యుండు భార్య/భర్త కన్న బిడ్డలు, బంధు మిత్రులు, వీరు వారు ననేల ఎల్లరు కొద్దిసేపు కూడ నాలస్యము చేయక దహన సంస్కారములు గావింతురు ఈ శరీరము బంతి వంటిది బంతిలో గాలి లేకపోతే బంతి ఎగురజాలదు శరీరములో గాలి లేకపోతే కదలాడజాలదు కావున గాలి నడయాడని శరీరము వ్యర్థము. ఉన్న కొద్ది రోజులు శరీరాన్ని ఎన్ని అవస్థల పాలు చేస్తుందీగాలి.

బావి మధ్యనుండి గిలక ద్వారా పైకి వచ్చుచు మరల క్రిందికి పోవుచున్న చేదకుండవలె జీవులు పలుమారు యోని ద్వారము గుండ పుట్టుచు గిట్టుచు నుందురు. ఈ జనన మరణము నుండి తప్పించు కొనుటకు గాను మంచి చెడ్డ, స్త్రీ పురుషులని రెండు యున్నట్లే దేహ నిర్మాణము కూడ రెండు విధములుగ చేయబడనది. అందు మొదటి రకం పైన చెప్పబడినది, ఇహము. రెండవది పరము. అదెట్లనగా గుద స్థానము నందుండి నడి నెత్తి వరకు మూడు జానల పొడవు వెన్నెముక మధ్యగా అతి సూక్ష్మాతి సూక్ష్మమైన రంధ్రము ప్రాకి యుండును. ఈ వెన్నెముకకు సరళ రేఖలో ముందు భాగమున ఈ క్రింద కనబఱచిన విధముగ ఏడు కమలములు సూక్ష్మ ముగ నుండును.

1 మూలాధారము :— ఈ కమలము గుదస్థానమునందు వ, శ, ష, స, యను నాల్గు దళములు కలిగి పచ్చని రంగు కలిగి 'స' ఆకారముతో పృధ్వీనిలయమై, ఘ్రాణాకారము కలిగి, భూమివలె నాలుగు కోణములతో నొప్పుచుండును ఆచార లింగము, స్వేచ్ఛా శక్తి కలిగి యుండును ఈ కమలమున కధిదేవత వినాయకుడు.

2 స్వాధిష్టానము :— మూలాధారమునకు సుమారు రెండు అంగుళముల పై భాగమున ఈ కమలము బ, భ, మ, య, ర, ల, యను ఆరు దళములు కలిగి,

తెలుపు వర్ణము కలిగి 'మ' ఆకారముతో జల స్థానమై జిహ్వాకారమై మూడు కోణములతో పక్షి ఆకారము కలిగి యొప్పుచుండును. గురు లింగము. క్రియాశక్తి కలిగి యుండును ఈ కమలమున కధి దేవత బ్రహ్మదేవుడు

3 మణిపూరకము :— స్వాధిష్టానమునకు మూడు అంగుళములు పై భాగమున ఈ కమలము డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, యను పది దళములు కలిగి, నీల వర్ణము కలిగి 'ఇ' ఆకారముతో అగ్ని ముద్రవాదోద్భవ స్థానమై పీఠికాకృతి కలిగి నాభి ప్రదేశమున నాడులను చుట్టుకొని మణివలె ప్రకాశించుచుండును శివలింగము, జ్ఞాన శక్తి కలిగియుండును. ఈ కమలమున కధి దేవత విష్ణువు.

4. అనాహతము :— మణి పూరకమునకు పది అంగుళములు పై భాగములో హృదయ స్థానము నందు ఈ కమలము క, ఖ, గ, ఘ ఙ,చ,ఛ,జ,ఝ ఞ,ట ఠ, యను పండ్రెండు దళములు కలిగి, సువర్ణచ్ఛాయ కలిగి, 'వా' ఆకారముతో వాయు నిలయమై, లింగాకృతి కలదై త్వగింద్రియ కారణమై యొప్పుచుండును. చరలింగము బీజశక్తి కలిగి యుండును వాయుముద్ర, నాద ప్రకాశ స్థానము ఈ కమలమునకధి పతి రుద్రుడు.

5. విశుద్ధము :— అనాహత చక్రమునకు పండ్రెండు అంగుళముల పై భాగములో కర్ణ స్థానమున కంఠ ప్రదేశము నందు ఈ కమలము అ, ఆ, ఇ ఈ. ఉ, ఊ, ఋ ౠ. ఌ. ౡ, ఏ, ఐ ఓ ఔ అం. అః, యను పదునారు దళములతో జ్యోతి వర్ణము కలదై 'య' ఆకారముతో గగన నిలయమై మత్స్యాకారము కలిగి యొప్పుచుండును, ప్రసాద లింగము, ఆకాశముద్ర ఆదిశక్తి. సరస్వతికి స్థానము ఈ కమలమున కధి దేవత జీవుడు.

6 ఆగ్నేయము :— విశుద్ధమునకు రెండంగుళముల పైన భ్రూమధ్య ప్రదేశములో హం, క్షం. యను ద్విదళములు కలిగి అంతఃకరణ నిలయమై అగ్ని హోత్రుని వలె ప్రకాశమానమై యొప్పుచుండును ఇది మహాలింగమై, పరాశక్తి యై, సువర్ణకాంతి గలిగి, సర్వసృష్టి నిలయమై ప్రకాశముద్రతో నుండును ఈ కమలమున కధి దేవత ఈశ్వరుడు.

7 సహస్రారము :— విశుద్ధమునకు పై భాగములో బ్రహ్మరంధ్రమున తేజో రూపముతో ఈ కమలము సహస్రదళములు కలిగి 'ఓం' అను ప్రణవవర్ణంబై దేదీప్యమానముగ ప్రకాశించు చుండును. ఓంకారలింగరూపముగ జ్యోతి నిలయమై సర్వాకర్షణ ప్రణవ స్థానమై బుద్ధికి నిలయమై మాయచే నావరింప సృష్టికి మూలాధారమై సత్యమునకు సృష్టి రహితమై సచ్చిదానంద స్వరూపమై యొప్పుచుండును. విమల జ్ఞానముద్ర. ఈ కమలమున కధి దేవత శ్రీగురు మూర్తి

పై ఆధిదేవతలు జీవుని ప్రధానముగ జేసి జీవుడు చేయు కర్మలకు సాక్షిగ నుండి ఆ కర్మ ఫలితముగ పునర్జన్మను ఇహపర సుఖములను కలుగ జేయును.

ఈ శరీరములో కుడి ఎడమ భాగములందు ఇడా పింగళ యను నాడులు మూలాధారము నుండి ఆగ్నేయము వరకు వ్యాపించి యుండును ఈ ఇడాపింగళల మధ్య సుషుమ్నయను నాడి ఆగ్నేయ కమలమునకు పై భాగమున బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించి శరీర మధ్య భాగములో ప్రధానమై యుండును. మనిషి పీల్చుగాలి జీవశ్శక్తి. ప్రాణవాయు వన బడును ఈ ప్రాణవాయువు ఆగ్నేయ కమల స్థానమగు భ్రూమధ్య మందుండి 'స' కారంబుతో బయలు దేరి మూలాధార కమలము నందు 'హ' కారముతో చేరి హంస 'సోహం' యను నామముతో పై కనబఱచిన ఏడు కమలముల కధి దేవతలగు వారికి ఉచ్ఛ్వాసనిశ్వాసములుగ ఎనిమిది అంగుళముల పొడవు లోనికి పూరకముగను, పండ్రెండు అంగుళముల పొడవు బయటికి రేచకముగను నర్పణ చేయుచుండును.

ఇటు వంటి గాలిని జీవితన ఇష్ట ప్రకారము పీల్చుటకును వదలుటకును పూని తన స్వాధీనములోనికి తెచ్చుకొన్న యెడల, పై కమలములలో గల అధి దేవత లందురు తన స్వాధీన మయ్యెదరు. మరియు ఈ ఆధిదేవతల శక్తి సామర్థ్యములు జీవునకు వచ్చును. అప్పుడు జన్మ జరామృత్యు భయము లుండవు జీవి తానే సర్వస్వము సర్వస్వము తానేయగును. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగ నుండు గాలి కారడవిలో పెద్దపులి వంటిది, ఆరితేరిన త్రాచు పాము వంటిది సామాన్యంగ సామాన్యులకు లొంగదు. నెమ్మదిగా మచ్చికచేసి, మైత్రి సంపాదించ వలెను జీవుడు అందులకు అనువగు వాతావరణమును కల్పించ వలెను. అప్పుడు గురువు

రూపంలో దేవుడు జీవుని వెదకి కొని శ్వాసను లొంగదీసి కొను విధానము నంతయు నుపదేశించును

జీవునకు నాల్గు స్థానములు గలవు. మొదటిది ఇహ సుఖము. రెండవది పర సుఖము. మూడవది ఉపాసనామహిమ కలిగెడు బ్రహ్మాలోకాధి స్థానము నాల్గవది ఈశ్వర సాక్షాత్కారము. మొదటి మూడు స్థానములలోను జీవునకు రాక పోక లుండును. నాల్గవ స్థానమందు విదేహ కైవల్యమగు ఆత్మైక్య జ్ఞానము కల్గును. ఈ ఆత్మైక్య జ్ఞానమే మోక్షమనబడును. ఇది శాశ్వతమైనది. ఆత్మ జ్ఞానము కావలయునన్న వైరాగ్యము కలుగ వలెను. దృశ్య విషయములందు దోషము జనించవలెను. దృశ్య విషయములు నశ్వరములనియు, దుఃఖ హేతువులనియు అర్థము కావలెను. అందుపై మనస్సులో విషాదము కల్గును ఆ విషాదము పర మేశ్వర ప్రాప్తి కొరకై యుండును.

మరియు జీవిచేయుకర్మలు కామ్య, నిష్కామ, నిషిద్ధములని మూడు విధములు. కామ్య కర్మలచే ఆయా కర్మలకు నిశ్చయింపబడిన ఫలమును ఇహమందును, పర మందును, మరుజన్మ వుందును జీవు డను భవించును. నిష్కామ కర్మముచే అంతః కరణ శుద్ధికలిగి జీవుడు దైవానుగ్రహమును పొంది జన్మరాహిత్యమగు మోక్షమును పొందును. నిషిద్ధ కర్మవలన చేయరాని చేయకూడని కర్మలు చేయుచు ఇహపరము లందును. పునర్జన్మ మందును జీవుడు దుఃఖమునే యనుభవించును. పుష్పముల యొక్క వాసన నేత్రములకు కన్పట్టక పోయినను పుష్పముల నాశ్రయించి యుండు నట్లు, కర్మ సంస్కారములు కంటికగు పడక పోయినను సూక్ష్మవాసనా రూపముగ జీవు నాశ్రయించి యుండును. వెయ్యావుల మధ్య దూడలు తమ తమ తల్లులనెట్లు కనుగొను చున్నవో అదే విధముగ కర్మలు చేసిన వానినే మరల మరల జన్మమెత్తు నపుడు పొందును.

ఇందులకు ప్రమాణముగా ఈ క్రింద శ్లోకమును చదువుడు.

శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః

వాచికైః పక్షిమృగతాం మానసై రంత్య జాతితాన్

అనగా దేహముచే చేయ బడిన పాప కర్మలకుగాను చెట్లు, తీగెలు, కొండలు గాను వాక్కుచే చేయబడిన పాప కర్మలకుగాను, పశు పక్షి క్రిమి కీటకాదులుగాను, మనస్సుచే దలంచిన పాప కర్మలకు గాను మానవజాతిలో అధమమైన వాడుగను పుటుచుండును. మానవ జాతిలో అధమమైనది అంగ వైకల్యము దరిద్ర జీవితము వగైరాలు. ఈ శ్లోకము ఎంత వరకు నిజమో పరికించ వలయునన్న మన చుట్టు నున్న మనుష్యుల ముఖా కృతులను పరికింపుము. మనషి ముఖము గల ముఖము గలవారు ఏ కొద్ది శాతము మాత్రమే యుందురు. మిగిలిన వారు జంతుముఖాలు, పక్షి ముఖాలు కల్గి యుందురు ఆ ముఖాకృతుల ననుసరించి వారి స్వభావాలు, ప్రవర్తన వుంటుంది. అది ఎందుకంటే పూర్వజన్మలో వారి జన్మ ఆకారం, కర్మ వాసన, మరు జన్మములో వెంటాడి వచ్చుట వలననే. అదెట్లో కొంత పరికింతము.

1. సింహం ముఖం వంటి ఆకారం గల ముఖాలు కలవారు పౌరుషం, సాహసం కలిగి వుంటారు, హుందాగా ప్రవర్తించుట, శాంతము, మంచిబుద్ధి, గౌరవ స్వభావము కలిగి వుంటారు.

2. గుఱ్ఱము ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు ఔదార్యము, గర్వము, అహంకారము కలిగి వుంటారు.

3. ఎద్దు ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు యితరులను లెక్క చేయరు. చాలా నిర్లక్షంగ వుంటారు. కష్టపడి పనిచేస్తారు. బాధ్యత కలిగి ప్రవర్తిస్తారు. వెట్టి చాకిరీలు చేస్తారు.

4. ఒంటె ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు యితరులను దెప్పి పొడుస్తారు. సానుభూతి, సహకారం అసలే వుండదు. క్రూరంగా ప్రవర్తిస్తారు.

5. ఎలుగు బంటి ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు అసభ్య ప్రవర్తన, యితరులను దూషించుట, ఎవరితోను కలియ కుండ ఒంటరిగ నుండుట, మూర్ఖత్వము కలిగివుంటారు.

6. తోడేలు ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు కపటము, దగా, మోసము, కుట్ర చేసే స్వభావము, తగవులాడే తుంటరి తనము, మొరటు ప్రవర్తన కలిగి వుంటారు.

7. గుంటనక్క ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు ధైర్యము, చాతుర్యము, గర్వము కలిగి వుంటారు మంచి చెడ్డలను విమర్శించి తెలుసుకొనే శక్తి. యితరులను పొగిడి మెప్పించగల నేర్పుకలిగి వుంటారు,

8. గొఱ్ఱె ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు సాధుత్వము, యితరులను అనుసరించే స్వభావము, మంచి తనము, పెంకితనము కలిగి వుంటారు.

9. గాడిద ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు సోమరితనం కలిగి బుద్ధి బలముతో చేసే పనులు ఏమీ సరిగా చేయలేరు శరీర పరిశ్రమలో కూడ నేర్పుగా ప్రవర్తింపలేరు. తిండి పోతులుగాను, దుర్గుణాలు కలవారుగానూ యుంటారు

10. పంది ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు నిర్లక్ష్యము, అతిగా తినే అలవాటు, మొరటు తనం, దయా దాక్షిణ్యాలు లేకుండా ప్రవర్తించుట కలిగి వుంటారు.

11. కుక్క ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు సాహసము, ప్రేమ, యజమానియందు భక్తి కలిగి విశ్వాసంగ ప్రవర్తిస్తారు.

12. పిల్లి ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు ఇచ్చకాలు చెప్పేవారుగ వుంటారు. గర్వము, అహంకారము కలిగి వుండి పైకి తేనె కురిపించేటట్లు మాట్లాడుతూ వెనుక గోతులు తీస్తారు.

13. కోతి ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు జాగరూకత కలిగి వుంటారు. పిరికితనం, మోసగించే స్వభావము, చిన్నచిన్న వస్తువులను దొంగిలించే అలవాటు, త్రాగుడు, వ్యభిచారము మొదలుగాగల దుర్గుణాలు కలిగి వుండి పోగర్తలకు లొంగిపోతారు.

14. రామ చిలుక వంటి ఆకారం గల ముఖం కలవారు చిలుక ముక్కువంటి ముక్కు కలిగి, లోభత్వము, అతి వాగుడు, దూరదృష్టి లేక పోవుట, స్వల్పజ్ఞానము, సున్నితమైన తత్వము కలిగి వుంటారు.

15. గుడ్లగూబ ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు ప్రతి దాని యందు నిగ్రహం కలిగి వుంటారు, అన్నిటినీ క్రమ పద్ధతిలో వుంచే నేర్పుకలిగి వుంటారు, కల్పనా శక్తి వుండదు, సాహసము తక్కువగా వుంటుంది,

16. కాకి ముఖం వంటి ఆకారం గల ముఖం కలవారు సిగ్గు లజ్జ లేకుండ ప్రవర్తిస్తారు. అవివేకము, లోభత్వము, అన్నివస్తువులు కావలయునన్న ఆశ వుంటుంది. వీలుగా వున్న వాటిని సంగ్రహించుకపోయే దురలవాటు కూడ వుంటుంది.

దేవుడనే వాడున్నాడో లేడో నిక్కచ్చిగ చెప్పలేము, కాని దేవుడనేవాడు లేక పోతే ఈసృష్టియంతయు ఎట్లు జరుగుతుంది? కావున దేవుడున్నట్లు మనము ఒప్పుకో వలసినదే; ఆదేవుణ్ణి ఎందరెందరో ఎన్నో విధాలుగ కొలుస్తున్నారు ఐతే ఎవ రెవరికి ఏమేమి అయినది? బీదవాడు బీదవాడుగనే యున్నాడు, సంపన్నుడు సంపన్నుడుగానే యున్నాడు. కొన్ని సందర్భాలలో బీదవాడు సంపన్నుడుగ, సంపన్నుడు బీదవాడుగ మారుతున్నాడు. దేవుణ్ణి మంచివారు చెడ్డవారు అని తార తమ్యం లేకుండ కొలుస్తున్నారు. మంచివారికి కొన్ని సందర్భాలలో, చెడ్డవారికి కొన్ని సందర్భాలలో మేలు కీడులు జరుగుతున్నాయి. ఇదంతా దేవుని దయవల్ల జరిగినట్లేనా? అంటే దేవుణ్ణి కొలిస్తే తమ కోరికలు తీరేటట్లుంటే, అందరూ దేవుణ్ణి కొలుస్తున్నారుగద, అందరి కోరికలూ తీరుతున్నాయా? పది మంది ఇండియాకు ఒకే మారు ప్రధానమంత్రి కావాలంటే అది వీలుపడుతుందా? దేవుణ్ణి కొలిస్తే కోరిన అవసరాలు తీరనప్పుడు ఆదేవుణ్ణి కొలిచేది దండుగేగద; మరియు అదృష్ట భేదం తప్ప యీ విశాల ప్రపంచంలో యితర భేదమిసుమంతైనా లేదు. మరి ఆ అదృష్ట భేదానికి కారణమేమిటి? ఆ అదృష్టాన్ని మానవాళికి సమానంగ పంచిపెట్టాలంటే మార్గమేమిటి? ఇందుకు జవాబుగ, నా అనుభవంగ ఒకటి చెప్పగలను. హిందూ శాస్త్రపురాణాల ప్రకారం కర్మ భేదమేకారణం. చావుపుట్టుకలు, అదృష్టా—దృష్టాలు కర్మ భేదము వల్లనే కలుగుతాయి. ప్రతి ఒక్కరికి ఏ లోపం లేకుండ అన్నిశక్తి యుక్తులు ప్రసాదిస్తాడు భగవంతుడు. నిజ జీవితంలో నిత్యకర్మలో చేయు కర్మల ఫలితంగ చచ్చేదానికి ముందు చేసిన కర్మలను నెమరు వేయించి ఆ కర్మలకు ప్రతి

ఫలంగ మరుజన్మ నిస్తాడు దేవుడు. అనగా కర్మల వల్ల జీవి బాగోగులు ఆధారపడి యున్నట్లే గద లెక్క! అలాంటప్పుడు ఆ కర్మలను సద్యో మార్గంలో నడిపిస్తే దేవుణ్ణి కొలవాల్సిన పనిలేదు, ఎవరికీ భయపడాల్సిన పని అంతకన్నాలేదు. కర్మలు కల్మష రహితంగ, ఫలాపేక్ష లేకుండ యుంటే ఆ దేవుడే మనకు దాసుడౌతాడు. కాని దేవుణ్ణి ప్రార్థించేది, కొలిచేది ఎందుకంటె మనం ఎంత జాగ్రత్తగ యున్నను మనలను తప్పుదారి పట్టించే దుష్టశక్తులు తరుమక మానవు. మన దేహంలో సూక్ష్మంగ అణగియున్న అరిషడ్వర్గాలై తేనేమి, త్రిగుణాలై తేనేమి, బాహ్య ప్రపంచంలో నిద్రలేచి పరుండేవరకు రక్షణ గ్యారంటీలేని విశ్వం దినదినగండంగ మారుతున్నప్పుడు మనలను రక్షించే దిక్కు ఎవ్వరు? ఆ పరమాత్ముడే! అతని ఆశీర్వాదంవుంటే కర్మలకు దోషంరాదు. మరియు పూర్వజన్మలో పుణ్యంచేసి నందుననే యిప్పుడు మానవజన్మకలిగింది. మరు జన్మ అనేది వుంటే మానవ జన్మేరాని, లేదంటే మోక్షమేరాని, గాని వేరు ఏమి కల్గినా వ్యర్థమేను. మరియు మోక్ష మంటే ఏమోకాదు, దేవునిలో ఐక్యమగుటే. కావున ఒక ప్రక్క కల్మష రహిత సత్కర్మ మరి యొక ప్రక్క దైవారాధనలు చేస్తూ యుండవలెను.

కర్మలలో భేదమున్నందుననే అందులకు ప్రతి ఫలముగ భేదమైన వివిధ జన్మలు కల్గుచున్నవి. మన కంటి ఎదురుగా ఎన్ని జీవరాసులు నడయాడుచున్నవో చూడుడు. వానికి ఆ జన్మలెందుకు రావలయును? మనకీ జన్మ ఎందుకు రావల యును? దీనికంత కారణం కర్మ భేదమేను. కర్మలు మంచివిగ, పదునుగు కొని యాడ దగినదిగ యున్నందుననే జన్మలలో మేలైన, యీ మానవజన్మ మనకు కల్గినది. అందరూ మానవులేయైనాకూడా, అదృష్ట భేదమున్నది కద! ఇదికూడ కర్మభేదఫలమేను. అన్ని జీవరాసులను, సృష్టి జాతమును, ప్రకృతిని, దైవాన్ని కూడ తన అదుపులోనికి తెచ్చుకోగల నైపుణ్యత శక్తి సామర్థ్యములు మానవజన్మకు కలవు. ఈ మానవజన్మ మరల వస్తుందను కోవడం పొరబాటు ఇంకా సమయం వుందికద చూచెదము లెమ్మని తాత్సారం చేయడం అంతకన్న పొరబాటు. లోకంలో మనిషిగాపుట్టిన వారందరు "నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరుగు వాడు ధన్యుడు సుమతీ" యనునట్లున్ను, దేహ యాత్రకు పలయు నట్టి యే లౌకిక కర్మలు చేయ వలయునో, వాటిని మాత్రము ఆచరించుచు, కర్తృత్వాభోక్తృత్వములను అతీతముగ

నుండి వలయును ఈ దినము ఒకడు ఒక శవమును మోసికొని పోయిన, వాని దేహమును మరియొక దినమున మరియొకడు మోసికొని పోవలసిన యోగము తటస్థింపక మానదు. కావున మనుజునకు మృత్యువు కాల పరిమాణము లేక క్షణ కాలములో నున్నదని తలంచి, వెనుక ఎప్పుడో సాధింతుమని యుపేక్ష సేయక దేహబలము, బుద్ధిబలము కలిగియున్న యిప్పుడే తన గమ్య స్థానమును, మానవ జన్మ లక్ష్యమును నగు మోక్షమును గూర్చి ప్రయత్నించవలెను.

తీర్థయాత్రలు సలుపుట పొంగళ్ళు పెట్టుట, విగ్రహమూర్తులను కొలుచుట, గంగాస్నానము చేయుట వగైరాలు మంచి నడవడిక, పరోపకార బుద్ధి వగైరాలు ఒనగూరుటకు తోడ్పడును. ఉత్తమశీల సంపద, పవిత్రత, ఋజు ప్రవర్తనము కలుగునట్లు చేయును. ఈ సద్గుణాలతో నీటిలో ముంచబడిన వ్యక్తి ఊపిరి పీల్చు కొఱకు ఆరాటపడునట్లు, లేగ దూడ తన తల్లి కొఱకు ఎదురుచూచునట్లు భగవంతుని దర్శన భాగ్యము కొఱకు తహ తహ లాడవలెను. ప్రహ్లాదుడు ఏ విధమైన యోగం చెయ్యలేదు. అతనికి తన నారాయణునిపై నమ్మిక. సుమతి ఏ చదువూ చదవలేదు. ఆమెకుతన భర్తపై, తన నిష్కల్మష పతిసేవ పై నమ్మిక, అనసూయ ఏవిధమైన తీర్థ యాత్రలు చేయలేదు. ఆమెకు తన పాతివ్రత్యం పైనమ్మిక వీరందరికీ చిత్తశుద్ధి, ఫలాపేక్ష రహిత కర్తవ్య నిర్వహణ, నారాయణునిపై నమ్మిక దోహదం చేసినది మేటివారుగ చేసినది అదే విధంగ అనన్య భక్తిగల అవ్వయారుకు విఘ్నేశ్వరుడు కైలాసాన్ని చూపాడు. రామదాసును చెఱసాల నుండి విడిపించాడు. నందనారు పనిని తానే నిర్వర్తించాడు. ఇంతయేల? ఇటీవల రెండు సంవత్సరములప్పుడు కాట్పాడి కృపానందవారికి వళ్ళిమలై తేరు నిర్మాణమునకు గాను దేవుడు పేటు రూపంతో వచ్చి పదివేల రూపాయలు యిచ్చి పోయినాడు. ఈ స్థితి కలగాలంచే ఆత్మశుద్ధి, ఇంద్రియ నిగ్రహము, జీవకారుణ్యము, దైవభక్తి నిరంతర పరమేశ్వర ధ్యానము యుండవలెను

చెట్టు ముందావిత్తు ముందాయని నిర్ణయించుట యసాధ్యమని కొందరందురు. కాని, చెట్టే ముందు, విత్తు వెనుక యని రూఢిగా చెప్పవచ్చును, చెట్టును ముందు సృజించి తరువాత ఆ చెట్టుకు తగిన విత్తు రూపొందించ బడినది, ఉదాహరణకు మఱ్ఱి, గుమ్మడిలను తీసికొన్నభు. మొదటనే పెద్ద చెట్టును వూహించి పెద్ద విత్తును

రూపొందించి యుండిన యెడల మఱ్ఱి చెట్టుకు గుమ్మడి కాయ యంత విత్తు, కాయ వుండ వలెను అందువలన గల్గు అనర్థములు కోకొల్లలు గద, బాటసారి కథ యిందులకు సోదాహరణము. అదే విధముగ సంసార సాగరమునకు యిది తుది యిది మొదలని తెలిసి కొనుటకు, సంసార సాగరమును యీదుటకు సాధ్యపడదని చెప్పెదరు. అది తప్పు, పట్టుదలా, దీక్షవుంటే సంసారాన్నే కాదు సాగరాన్నే కాదు సర్వస్వాన్నీ యీదవచ్చును. సాధించ వచ్చును. విశ్వామిత్రుడు మహా రాజుగా యుండి, పట్టుదలా దీక్ష వైరాగ్యాలున్నందుననే వశిష్టుని సాటియైనాడు. జనకుడు మహా చక్రవర్తిగ యుండి కూడ సంసారంలో యిహంలో తామరాకుపై నీటి బొట్టు వలె యుండి నందుననే రాజర్షియైనాడు. ఇదంతా ఒకరి బలవంతంతో గాని, ప్రోద్బలంతో గాని ఒనగూడేది కాదు, పండబెట్టి పంగనామంబెటితే ఎంత వరకు ఆ పంగనామాన్నుంచుకోగలడు. గట్టిగా పట్టుకున్నంతసేపే కదా! అదే విధంగ మానవ జన్మమెత్తిన ప్రతి వారూ తమకు కాలకృత్యములు, ఆహార పానీయములు, నిద్రా సుఖములు, విద్యావ్యాసంగములు, ఏ ఒక్కటి తక్కువ కాకుండ యాంత్రికంగ జరుగునట్లు జాగ్రత్త పడెదరో అదే విధముగ దైవ దర్శనానికైతేనేమి, తన జీవిత సార్థకతకైతేనేమి పాటు పడవలెను.

ప్రకృతి, ప్రకృతి యంటారే ఆ ప్రకృతి అపరాప్రకృతి, పరాప్రకృతి యని రెండు విధములు, అపరాప్రకృతి భూమి, నీరు, అగ్ని, గాలి, అకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము యని ఎనిమిది వస్తువుల సమ్మేళనము, పరాప్రకృతి దీనికంటె భిన్నమై సృష్టిగ, మనుగడగ, కార్య రూపంగ యుండి అపరాప్రకృతి యాధారముతో చరచరాత్మకమగు సకల ప్రపంచమునై యున్నది. ఇదియే సృష్టి రహస్యము, ఈ పరాప్రకృతి ఏడుగురు దేవతలను తన యందు సూక్ష్మముగ ధరించిన మానవుని తప్పుదారి పట్టించి భూమిపైయున్న కొద్ది రోజులు కూడ సుఖ శాంతులు లేకుండ జేయును. దీని లక్షణములు.

1. శరీరమే నేను, నేనే శరీరమని యెంచుట.

2. దారా పుత్రాదులయందు, ధన కనక వస్తు వాహనములందు సామాన్య కోరిక బదులు మిక్కిలి దురాశకలిగి యుండుట.

3. పరుల సుఖమును జూచి ఓర్వలేక యుండుట.

4. సకలమును తానే యనుభవింప వలయునని యెంచుట.

5 ధన, సంపత్తు, విద్యాధికములచే మిక్కిలి గర్వము చెందుట.

6. తన కర్తవ్యమును, గమ్యమును మరచిపోవుట

వీటన్నిటికి కారణము ఈ శరీరములో తమోగుణము, రాజస గుణము, సాత్విక గుణమని మూడు గుణములే.

1. వీటిలో తమో గుణము మిక్కిలి నికృష్టమైనది. నీచమైనది, పాపహేతువైనది, అన్ని అవలక్షణాలూ కల్గినది. దీని లక్షణములు మూడు, అవి సోమరితనము, అతి నిద్ర, మరపు, దీనికి విరుగుడు ఆసనాభ్యాసము.

2. రజో గుణము తమో గుణమున కన్నను కొంచెము మెఱుగైనది. దీని లక్షణములు జీవి భావములను, చేష్టలను నిలకడ లేకుండ చేయును. బుద్ధిని దృశ్య ప్రపంచము పై బోనిచ్చును. బంధములకు మూల కారణము యీ రాజసమే. దీనికి విరుగుడు స్వధర్మాచరణము. ఎన్ని కష్టములు వచ్చినను, ఎన్ని బాధలు పడినను స్వధర్మాచరణము నుండి తప్పరాదు. అందువలన కర్మఫలాపేక్ష వుండదు. స్వధర్మా చరణము చిత్త శుద్ధికి హేతు వగును. చిత్త శుద్ధికి పాటుపడు స్వధర్మాచరణము కర్మ యోగమనిపించుకొనును. ఈ కర్మ యోగముచే చిత్తైకాగ్రత కల్గును. మనస్సు యొక్క చంచల స్వభావము నశించును. అప్పుడు రజోగుణము నిగ్రహింప బడును.

3. సాత్త్వికము మంచిదైతే కూడ, బంధములకు, పునర్జన్మకుకారణమగును, దీనిని కూడ విడువవలెను. ఫలత్యాగము ద్వారా దీనిని విడువ వచ్చును. ఈ సాత్త్విక గుణం తానంతటదే యనుభవముపై అలవడును

ఈ త్రిగుణముల నుండి విడువబడిన మనుష్యుడు జన్మజరామృత్యుభయముల నుండి విడువబడి పరమ కల్యాణమును బెందును. ఈ త్రిగుణ రాహిత్యమును సాధించుటకు యీ క్రింది పద్ధతులను తూచా తప్పక పాటించవలెను.

1. అహింస చేయరాదు. ఎట్టి జీవ జంతువులను చంపరాదు. తన కంటె తక్కువ వారైనను వారి మనస్సు నొచ్చునట్లు మాట్లాడరాదు.

2. తనకు ప్రాణహాని కలిగినను అబద్దమాడ రాదు. మనసా వాచా కర్మలనేక బద్ధముగ నుండవలెను.

3 తను ఎంత నిరుపేదగా నున్నను పరుల సొత్తును ఆశింపరాదు.

4. తనకు కల్గిన దానిలో పాత్రచూచి దానము చేస్తూ, అందువలన ప్రతి ఫలాపేక్ష ఆశించ కుండయుండవలెను.

5. ఎదుటి వారిని తనవలెనని తలచి, దయ సమ భావముకలిగి యుండవలెను.

6. ఇతరులు తనకు చేసిన కీడును, తను యితరులకు చేసిన మేలును మరచి యుండవలెను.

7. కోపములేక ఎల్లప్పుడు సంతోషముగా నుండవలెను.

8. సాత్వికాహారమును మితముగా భుజించి, స్వల్ప నిద్ర కలిగియుండవలెను.

9. మితముగా మాట్లాడవలెను. ప్రియమును మాత్రమే పలుకవలెను

10 పరస్త్రీ/పురుషులను మోహింపక సోదరీ/సోదర భావము కలిగియుండవలెను

11 ఒక రిద్దరు బిడ్డలు కల్గిన తర్వాత భార్యా భర్తలు సోదర భావముతో మెలగవలెను.

12. పద్మ, సిద్ధ, వీర, సుఖాసనములలో దేనినైన నొక దానిని ఆచరించవలెను.

13. తీరిక చిక్కినప్పుడల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసములతో 'ఓం' అని జపించు చుండవలెను.

పై ప్రక్రియలను నియమ బద్ధముగా నాచరించు వారి మనస్సు మిక్కిలి నిర్మలముగాను, పరిశుద్ధముగాను, నుండును అందువలన సద్గుణ సంపత్తి, సచ్ఛీలము,

సన్మార్గాచరణ. అంతరంగిక సౌశీల్యము కల్గును. ఇవియే మోక్షమును పొందుటకు మెట్లు. తటాకములోని పాచిని ఎంత దూరము పోగొట్టినను మరల ఆ పాచి యథా ప్రకారముగ ఆ నీళ్ళను క్రమ్ముకొనునట్లు మనుజుడు పై పద్ధతుల నవలంబించుట యందు పరాకుగ నుండెనేని మనస్సు లౌకికం లోకి యథా విధిగ జొరబడి జీవుని నానా యవస్థల పాలుచేయును. అట్లు కాకుండ యుండుటకు గాను, కొన్ని క్రమ పద్ధతుల నవలంబించవలసి యున్నది ఆ పద్ధతులలో ముఖ్యమైనవి కొన్నియివి,

1, నియమిత ప్రకారం గుడికి పోవుట, సగుణం తర్వాతనే నిర్గుణం, కావున విగ్రహారాధనను జీవితాంతం వదలక చేయుట,

2, మహానుభావుల ఉపన్యాసములను తప్పక వినుట, ఉపన్యాస కర్తలను ఇంటికి ఆహ్వానించి ఆదరించుట, వారితో వాదనలు చేయక సందేహ నివృత్తికై ప్రయత్నించుట,

3, భజనలను, గోష్ఠులను ప్రోత్సహించుట, వాటికి హాజరై అందులో ముఖ్య పాత్ర వహించుట.

4. స్వగృహములో నందరు విగ్రహారాదనను చేయునట్టు చూచుట, భక్తిపూరిత గ్రంథములను నీవు చదువుట, ఇంటిలో వారందరు కూడ చదువునట్లు చూచుట.

5. ప్రతినెల వచ్చు పౌర్ణమినాడు పౌర్ణమి పూజను శక్తియుంటే నీఇంటి యందు చేయుము. శక్తిలేకపోతే మీ గ్రామ గుడి యందు గాని, పట్టణాలలోనైతే వీధి వీధిలో చేయునట్లు ప్రయత్నించుట. ఈ పూర్ణిమ పూజయే సత్యనారాయణ వ్రతమనియు అనబడును, ఈ వ్రతము నెరవేర్చుట వల్లన పిన్నపెద్దలు చాలా మంది హాజరగుదురు. వారు కూడ ఆధ్యాత్మికొన్ని అలవరచు కొందురు, ఈ వ్రత మును చేయు విధానమును ఇందులో పొందుపఱచ బడినది.



# శ్రీ గణేశ స్తోత్రమ్.

ఏక దంతం మహాకాయం తప్త కాంచన సన్నిభం
లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకం

మౌంజీ కృష్ణాజినధరం నాగ యజ్ఞోపవీతనం
బాలేందు సిలసన్మౌళిం వందేహం గణనాయకం

అంబికా హృదయానందం మాతృభిః పరిపాలితం
భక్త ప్రియం మదోన్మత్తం వందేహం గణనాయకం

చిత్ర రత్న విచిత్రాంగం చిత్ర మాలా విభూషితం
చిత్రరూప ధరం దేవం వందేహం గణనాయకం

గజవక్త్రం సుర శ్రేష్ఠం కర్ణచామర భూషితం
పాశాంకుశదరం దేవం వందేహం గణనాయకం

మూషికోత్తమ మారుహ్య దేవాసుర మహా హవే
యోద్ధుకామం మహావీర్యం వందేహం గణనాయకం

యక్ష కిన్నర గంధర్వ సిద్ధ విద్యాధరైస్సదా
స్తూయమానం మహాత్మానం వందేహం గణనాయకం

సర్వ విఘ్నకరం దేవం సర్వ విఘ్న వివర్జితం
సర్వ సిద్ధి ప్రదాతారం వందేహం గణనాయకం

# ఓం కలశ పూజ.

1. శ్రీమన్మహా దేవదేవోత్తమ దేవకంఠీరవ దేవకల్పవృక్షమా
దేవగంధర్వ దేవసుజ్ఞాన దేవప్రసన్న దేవసంరక్షణ దేవవరదం
పండిత భక్త వరదం బృందబృందారక మందమందారక
మందద్యుత మందహాస మందచందన మందహాస మందమందస్మిత
బృందపాదోన్నిధి బృందబృందేందిందిరమ్ ఇందు ఇందేందిందిరమ్
స్ఫుటస్ఫుట నెటనెటస్ఫుట టటటట లలలల రరరర జజజజ నఖస్ఫుట
జేంజేంకార భైరవస్ఫుట నవహం హం హంసస్వరూపం బిందుబింద్వోళ
బిందురూపం బిందుమధ్యే పంచకోణ చక్రబిందు మధ్యేనవహం
హంస స్వరూపం బిందు బిందోత్కళ బిందురూపం
హ్రీంజ్రీంకారచక్ర చక్రాక్షణ చక్రమూలాకృతి చక్రస్వాధిష్ఠానచక్ర
అనాహతచక్ర విశుద్ధచక్ర బిందురగ్రహచక్ర ప్రాణప్రతిష్టచక్ర
బిందు మధ్యే పంచకోణచక్ర బిందుమధ్యే
కహకహ కుహకుహ డడడడ ణణణణ
సృష్టిప్రతిపాలకాం దేవరత్నం భక్తప్రతిపాలకాం దేవరత్నం
నిరాకారం నిరంజనం నిర్విధారం నిర్విచారం నిర్వేశనం
నిర్విలంబం నిష్ప్రపంచం నిర్విగుణ నిజస్వరూపం ఉగ్రరుద్ర
స్వరూపం
రక్తముఖ రక్తనిటల రక్తగంధ రక్తపుష్ప రక్తమేని రక్తారాధన
ఏకాదశదైత్య మహా మారణ హోమగుండం శత్రుమహామారణ
హోమగుండం
శతానన శతానంద శతకుమార శతహిత శతకళత్ర
అంధకాసుర మాంసభక్షే మహిషాసుర మర్దన
శ్రీమన్మహా విశ్వకంఠీరవ విశ్వద్గురు వీరశరభయాచార్య
కవివాక్పటుత్వ ముక్తి నగరస్థళ మాణిక్య ఐశ్వర్య మరకతవల్లి
ప్రాణప్రతిష్ఠదేవతాయాం వేలూరు రామగురు తత్త్వలింగం
శాంతశిలాభినోద భావలింగం పాహిమాం పాహిమాం పాహిమాం

2. కలస్య ముఖే విష్ణు కంఠే రుద్ర స్సమాశ్రిత
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాశ్రితః
కుక్షౌతుసాగ రాస్సర్వే సప్తద్వీపావ సుంధరా
ఋగ్వేదో యజుర్వేదో సామ వేద హ్యధర్వణః
అంగైశ్చస్సహితాస్సర్వే కల శాంబు సమాశ్రితాః
ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః
ఓం సత్యం ఓం తత్స వితుర్వరేణ్య మితి సర్వ పక్షే
మహాదేవి సంధ్యా విద్యే సరస్వతి సావిత్రి గాయత్రి త్రిలోక్యోశ్చారణే
సవ్యాకృతికే చతుర్ధోశ్చారణే స్రవణవే పంచమోశ్చారణే
షష్టిరుచో ద్దర్శన షడక్షర మంత్రోశ్చారణే
ఇదం ప్రాణ వ్యాపార వ్యాపారాణాం అధయాం ప్రమేతి
సహాతి హంసతి
సమస్త మరుద్గణోద్భవాన్ స్రవణవే త్రిమూర్త్యాద్యుద్భవాన్
అష్ట ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ
సమాద్యష్టాంగ యోగ మిశ్రితే శుద్ధ స్ఫటిక సంకాశ పక్షే
మహా విలాసిత మాయా వినాశ సంజాత
ఘుమ ఘుమ్మారవశబ్ద బ్రహ్మోద్భవిత నాదం
విణివిణీతి సర్వయుక్త సకల మంత్ర హోమ లోలాతీత

మహాదేవదేవ విరాజిత కుందేందు చందన తారహార
సీహార కర్పూర పయః పారావార తరంగిణీ
తరంగ కమల డోలికా
మకుట జ్వాజ్వల్యమాన సంసార దీప్తి హారిణీ
మహాదేవీ నమోస్తుతే !

ఓం మూలాధార శక్తి స్వరూపిణేనమః — ఆసనం సమర్పయామి
ఓం స్వాదిష్టాన శక్తి స్వరూపిణే నమః — అభిషేకం సమర్పయామి
ఓం మణిపూరక శక్తి స్వరూపిణే నమః — వస్త్రం సమర్పయామి
ఓం అనాహత శక్తి స్వరూపిణే నమః — పుష్పం సమర్పయామి
ఓం విశుద్ధ శక్తి స్వరూపిణే నమః — దీపం సమర్పయామి
ఓం ఆగ్నేయా జపకుండలీ శక్తి స్వరూపిణే నమః ధూపం సమర్పయామి
ఓం సహస్రారోర్ధ్వ కుండలి సర్వలక్షార్థ శక్తి స్వరూపిణే నమః
నైవేద్యం సమర్పయామి

ద్రాక్షా ఖర్జూర సంయుక్తే నారికేళ ఫలాన్వితం
శర్కరామధు సంయుక్తే నైవేద్యం పరిగృహ్యతాం
వేదవేదార్థకం సారం విస్తారం మంగళం పరం
మంగళం పరమందామ సద్గురుం ప్రణమామ్యహమ్
ఓం మహాశక్తి స్వరూపిణే నమః
భక్ష్యభోజ్య లేహ్య చోష్యమ్రిడ సమ్మిళిత మధు మాష సహిత
మహా పదార్థం మహా నైవేద్యం సమర్పయామి
కలశ పూజాం సమర్పయామి

అటు తర్వాత పఠమునకు ఈ క్రింద కనిన మంత్రముః పూజ సేయవలెను.

## గురుధ్యాన మంత్రములు.

1. గురు బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురు సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః
2. సంసార వృక్ష మారూఢాః పతన్తి నరకార్ణవే
యస్మాత్సముద్ధరతే సర్వాన్త స్మై శ్రీ గురవే నమః
3 స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్స చరాచరమ్
త్వంపదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః
4. అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః
5. చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యంస చరాచరమ్
అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః
6. జ్ఞాన శక్తి సమారూఢ తత్త్వమాలా విభూషిణే
భుక్తిముక్తి ప్రదాత్రేచ తస్మై శ్రీ గురవే నమః
7. అనేక జన్మ సంప్రాప్త కర్మ బంధ సిదాహినే
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవే నమః
8. భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహ భ్రాన్త చేతనః
ఏన సందర్శితః పన్థాః తస్మై శ్రీగురవేనమః
9. తాపత్రయాగ్ని తప్తానా ముశాన్తప్రాణి నాం ముదే
గురు రేవ పరాగంగా తస్మై శ్రీ గురవే నమః
10. హేతవే జగతామేవ సంసారార్ణవసేతవే
ప్రభవే సర్వ విద్యానాం శంభవే గురవే నమః
11. నమోచ్యుతాయ గురవే జ్ఞానధ్యానైక భావవే
శిష్య సన్మార్గ పటవే కృష్ణాపి యూష సింధవే

12. హార లీలావతారాయ శంకరాయ పరాజసే
కైవల్యం కల్పనా కల్ప తరువే గురవే నమః

13. అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః

14. చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం
నాదబిందు కళాతీతం తస్మై శ్రీ గురవే నమః

15. ఏన చేత యతా హీదం చిత్తం చేత యతే నరః
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది తస్మై శ్రీ గురువే నమః

16. సత్యా నందాయ రూపాయ బోధైక సుఖ కారిణే
నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే

17. సచ్చిదానంద రూపాయ వ్యాపినే పరమాత్మనే
నమ(శ్రీ) గురునాధాయ ప్రకాశానంద మూర్తియే

18. మన్నాధ శ్రీ జగన్నాధో మద్గురు (శ్రీ) జగద్గురుః
సాత్మైవ సర్వ భూతాత్మా తస్మై శ్రీ గురవే నమః

19. కృష్ణ ద్వైపాయనం వ్యాసం సర్వలోక హితే రతం
వేదాబ్జ భాస్కరం వందే శమాది నిలయం మునిమ్

20. యదంఘ్రి కమల ద్వంద్వం ద్వంద్వం తాప నివారకం
తారకం భవసింధోశ్చ శ్రీ గురుం ప్రణమామ్యహమ్

21. మనోబుద్ధ్యహంకార చిత్తా నినాహం
నస్తోత్రం నజిహ్వా నచఘ్రాణ నేత్రా
నచవ్యోరు భూమిర్న తేజోనవాయు
శ్చిదానంద రూపశ్శి వోహం శివోహం

22. నచప్రాణ సంజ్ఞోనవై పంచవా యుర్నవా
సప్తధాతుర్నవా పంచకోశః
నవాక్పాణి పాదేనచో పస్థపాయు
శ్చిదానంద రూపశ్శి వోహం శివోహం

23. నమోద్వేషరాగే నమోలోభమోహౌ
మదోనైవమేనైవ మాశ్చర్య చవః
నధర్మో నచార్థో నకాయానమోక్షః
శ్చిదానంద రూపశ్శివోహం శివోహం

24. నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం
నమంత్రో నతీర్థం నవేదా నయజ్ఞాః
అహం భోజనం నైవ భోజ్యం నభోక్తా
శ్చిదానంద రూప శ్శివోహం శివోహం

25. నమృత్యుర్నశంకా నమోజాతి భేదః
పితానై నమోనైవ మాతాచ జన్మ
నబంధు ర్నమిత్రం గురుర్నైవ శిష్య
శ్చిదానంద రూప శ్శివోహం శివోహం

26. అహం నిర్వకల్పో నిరాకార రూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం
నచాసంగతమనైవ ముక్తిర్నమయ
శ్చిదానంద రూప శ్శివోహం శివోహం

# మూలాధార మంటప వినాయక పూజ

మూలాధార మంటపే చతుర్ధళ పద్మే
అగ్ని చక్ర స్థితాయాం పీత వర్ణాయాం
పుష్టి శక్తి సమేతాయాం శ్రీ వినాయకాయాం
ఓం ఐం గ్లీం సౌం ఓం రాం రీం హిం సః
వం శం షం హం సం స్సోహం సోహం
వశషస దళే యుక్తే తమ్మికాధార పద్మే
అరుణ దరుణ గాయత్రీ వారణాశి నదేశాయి
అభయ వారద హస్థం చారుపాంశం కుచోద్యంచ

చతుర్ముఖన చింతయే దారి మూర్తిం
పంచపూజాం కృత్యాం
పృధివి తత్వాత్మనే జీవాత్మనే పరమాత్మనే
గంధం సమార్పయామి
అం ఆకాశ తత్వాత్మనే జీవాత్మనే పరమాత్మనే
పుష్పం సమర్ప యామి
యం వాయు తత్వాత్మనే జీవాత్మనే పరమాత్మనే
ధూపం సమర్పయామి
రం తేజో తత్వాత్మనే జీవాత్మనే పరమాత్మనే
దీపం సమర్పయామి
మం ఉదక తత్వాత్మనే జీవాత్మనే పరమాత్మనే
నైవేద్యం సమర్పయామి
కుం శక్తి తత్వాత్మనే జీవాత్మనే పరమాత్మనే
తాంబూలం సర్వోపచారం సమర్పయామి

షట్సహస్ర అజప గాయత్రీ శ్రీ వినాయక నివేదయామి

తత్సత్ బ్రహ్మార్పణమస్తు

# స్వాధిష్టాన మంటప బ్రహ్మ పూజ

స్వాధిష్టాన మంటపే షడ్కాళ దీపే

బీజ చక్ర స్థితాయాం రక్త వర్ణాయాం

శ్రీ సరస్వతీ సమేతాయాం శ్రీ బ్రహ్మణే

ఓం ఐం గ్లీం సౌం ఓం హ్రాం హ్రీం హం సః

బం భం మం యం రం లం హంస స్సోహం సోహం

బ భ మ య ర ల సౌభ్యక్ష రైరుక్తం

పాత్రీచార చిద్ర మభవిష్టం పంకజాస నిదానం

అభయ దారద హంతం కుండలీనాం సాక్షిమూలం

విద్వయమలం మూర్తి చింతయో విశ్వయోని

పంచ పూజాం కృత్వాం

షట్సహస్త్రి అజపగాయత్రి శ్రీ బ్రహ్మ నివేదయామి

తత్సత్ బ్రహ్మార్పణమస్తు

## మణి పూరక మంటప విష్ణు పూజ

మణి పూరక మంటపే దశ దళ పద్మే
బిందు చక్రస్థితాయాం నీల వర్ణాయాం
శ్రీ మహాలక్ష్మి సమేతాయాం శ్రీ మహా విష్ణువే
ఓం ఐం గ్లీం సౌం హ్రాం హ్రీం హం సః
డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం హంసస్సోహం సోహం
ధ్యానం దాది హపాత ర్ణైయై ప్రకల్పిత దళ పద్మే
నియుష్ట మార్తాండ విద్వైమాది పురుషః
పంకేరుహే బీజం నారాయణ చింతయో
హస్తాబ్యేషాగ దాదిషకాం మమలం
పీతాంబరం కౌస్తుభం శ్రీ వత్సలాంకితం
ఇంద్ర నీల సదృశం ధ్యాయో జగన్మోహనం
పంచపూజాం కృత్వాం
షట్సహస్ర అజపగాయత్రీ శ్రీ మహావిష్ణవే నివేదయామి
తత్సత్ బ్రహ్మార్పణమస్తు

## అనాహత మంటప రుద్రపూజ

అనాహత మంటపే ద్వాదశ దళే పద్మే
నాదం స్థితాయాం శ్వేతవర్ణాయాం శ్రీ ఉమామహేశ్వరాయాం
ఓం ఐం గ్లీం సౌం ఓం హ్రాం హ్రీం హం సః
కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం
ఞం టం ఠం హంసస్సోహం సోహం ధ్యాన కనిష్టాం
తర్కాతీతైయై ప్రకల్పిత దళ
శ్రీ పార్వతీ కారితా కాంత శశాంక కోటి తులినం

పశ్వపక్షోజ్వలం టంకం పరాభవే
పృత్వాం గాంధారి యుక్తం రుషోజ్వలం
గ్రయన్ యోగాంగ శహనపురం చర్మాంబరం
పంచ పూజాం కృత్వాం
షట్సహస్ర అజప గాయత్రీ శ్రీ ఉమా మహేశ్వర నివేదయామి
తత్సత్ బ్రహ్మార్పణ మస్తు

## విశుద్ధ చక్ర మంటప జీవ పూజ

విశుద్ధ చక్ర మంటపే షోడశ దళ పద్మే
తాలి మూలే జ్యోతి శ్చక్ర స్థితాయాం తేజో రూపాయాం
శ్రీ మహాశక్తి సమేతాయాం శ్రీ జీవాత్మనే
ఓం ఐం గ్లీం సౌం ఓం హ్రాం హ్రీం హాం సః
అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం
ఎం ఏం ఐం ఒం ఓం ఔం అం అః
హంసస్సోహం సోహం ధ్యానిం మూర్తి ద్వేపాదిరిష్టం
కరహితం శ్యాంతం తుషాభాస్కరం వ్యాప్తియేన చరాచరమ్
పాలైక్యం సమిళితం ముక్త ముక్తే మనేక మమలం
జ్యోతి ప్రదీపో హంసహః సాక్షాత్ షోడశవర్ణ పత్రమయం
జీరకపురం చింతయో పంచ పూజాం కృత్వాం
షట్సహస్ర అజపగాయత్రీ శ్రీ జీవాత్మ నివేదయామి
తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

## ఆగ్నేయ(జ్ఞాన) మంటప ఈశ్వర పూజ

జ్ఞాన మంటపే ద్విదళ పద్మే శాంతి చక్ర స్థితాయాం
విద్యుత్ వర్ణాయాం శ్రీ జ్ఞాన శక్తి సమేతాయాం శ్రీ గురవే
ఓం ఐం గ్లీం సౌం ఓం హ్రాం హ్రీం హాం సః

హం క్షం హంసస్సోహం సోహం హంజ్యాంజ్యాం
పరబ్రహ్మం పత్రకమలే దివ్య జగత్కారణం
విశ్వాతీతం మనేక దేవనీయాం చారుశ్చంద్ర మాతృకాప్రియాం
తత్వకేశ్వరం దేశ భువనం పాలైక్యం దీపాంకు
ప్రత్యక్షరాక్షర విగ్రహా శ్రీ గురు పద ధ్యాయే విభుం శాశ్వతం
పంచ పూజాం కృత్వాం
షట్సహస్ర అజపగాయత్రీ శ్రీ గురువే నివేదయామి
తత్సత్ బ్రహ్మార్పణమస్తు

## బ్రహ్మరంధ్ర మంటప శ్రీ గురు మూర్తి పూజ

బ్రహ్మ రంధ్ర మంటపే సహస్ర దళ పద్మే
బ్రహ్మ చక్ర స్థితాయాం నానా వర్ణాయాం
శ్రీ చిద్శక్తి సమేతాయాం శ్రీ పరమాత్మనే
ఓం ఐం గ్లీ సౌః ఓం హ్రాం హ్రీం హం సః
అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం
ఎం ఏం ఐం ఒం ఓం ఔం అం అః
కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం
టం ఠం డం ఢం ణం తం థ ం దంధం నం
పం ఫం బం భం మం యం రం ఱం లం ళం
వం శం షం సం హం క్షం హంస స్సోహం సోహం
విశ్వ న్యాశిన మాది దేవ మమలం నిత్యం పరం పద్మం పలంకా సూత్ర
తణు అణుప్రదేశ తహారం స్నుశ్చంధ్ర పర్యంతం
పంచ పూజాం కృత్వాం
షట్సహస్ర అజప గాయత్రీ శ్రీ పరమాత్మ నివేదయామి
తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

## షడాధార పూజ

హంసో గణేశో విదిదేవ హం సోహం సోహం
రీం బ్రహ్మం సమర్ప శంభు అంశోపయో గురుదేవహంసః
ఆత్మ పరమాత్మ హంసః సోహం ఉచ్ఛ్వాస నిశ్వాస
సాక్షి చిద్రూప హరితంత్రం బ్రహ్మం శాశ్వతం
కర్తభోక్త మానస చరో జీవన్ముక్తిః
నిత్యోస్తూ ద్యోయాశి భాహకారేందు భహేర్యాంతః
సకారేందు విషత్రూణః హంస హర్యేం సోహం
పరమ మంత్ర జీవేజపతే సర్వదాతః
అజపనామ గాయత్రీ యోగీనాం ముక్తి అధ్యాయోనాం
యత్నం సంకల్పమాత్రేణాం సర్వపాప ప్రముచ్చతే
షడ్చతాని గణేశాయాం షడస్రహస్వయంభువే విష్ణువే
షడ్సహస్రం తుష సహస్రం పినాకినీ సహస్ర మాత్వేనేచైవ
సహస్రం వరమాత్మనే సహస్రం యోగ గురువే సమర్పయామి
శ్రీ సదాశివోహయాకాయ యా వచః మనస్సేంద్రియానాం
బుద్ధ్యాత్మ నాడాం ప్రకృతే స్వభ వాం
తత్కారోమివిత్వాం సకలం పరమేష్టిః
శ్రీమన్నారాయణ యతి సమర్పణయామి శ్రీసద్గురు వేనమస్తుః
శ్రీ అఖండ పరిపూర్ణ సచ్చిదానంద అద్వైత జ్యోతి స్వరూప
శ్రీ సాక్షాత్ శ్రీ శంకరాయ సద్గురు బ్రహ్మణమస్తు
శ్రీ మంగళం మంగళం మంగళం
శ్రీ శంకరాయ సద్గురు బ్రహ్మణేనమః

## మంగళం

మంగళం భగవాన్ శంభో మంగళం వృషభధ్వజః
మంగళం పార్వతీనాధ మంగళం భక్తవత్సలః
మంగళం భగవాన్ విష్ణో మంగళం మధుసూదన

మంగళం పుండరీకాక్ష మంగళం గరుడధ్వజ
మంగళం మద్గురుభ్యోస్తు తద్గురు భ్యోస్తు మంగళమ్
అస్మత్సర్వ గురుభ్యోస్తు నిత్యశ్రీర్నిత్య మంగళమ్
కాయేనవాచా మనసేన్ద్రియైర్వా
బుద్ధ్యాత్మ నానా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి
యదక్షర పదభ్రష్టం మాత్రా హీనంచ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ పరమేశ నమోస్తుతే
పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ మిదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావ శిష్యతే
సర్వేషాం స్వస్తిర్భవతు
సర్వేషాం శాంతిర్భవతు
సర్వేషాం పూర్ణం భవతు
ఓం శాంతిః శాంతిః శాంతిః
శంభో శివ శివ శివ శివ శివ శివ.

అటు తర్వాత చంద్రునికి పంచామృతం, నైవేద్యం, పుష్పతాంబూలాదులను సమర్పించి ఈ క్రిందకనిన శ్లోకములను పాడవలెను.

శ్లో॥ ఓం క్షీరపుత్రాయ విద్మహే
అమృత తత్వాయ ధీమహి
తంనో చంద్రః ప్రచోదయాత్

శ్లో॥ శ్వేతాంబరాన్వితవ పుర్వర్ణ శుభ్రవర్ణం
శ్వేతాశ్వయు క్తరథగం సురసేవితాంఘ్రిం
దోర్భ్యాంధృతా భయధరం వరదం సుధాంశం
శ్రీవత్సమౌ క్తికధరం ప్రణమామి చంద్రం

పా॥ చందమామా చందమామా చందమామా

ఈసంధి తెలిపే జ్ఞానులెవరె చందమామా

కాయమను పుట్టలోను చందమామా

పాము మాయగానె మెలగుచుండు చందమామా

జంట నాగస్వరములూది చందమామా

పామును పాదు పెకలింపవలెను చందమామా

తొమ్మిది వాకిళ్ళుమూసి చందమామా

పామును నెమ్మదిగా పట్టవలెను చందమామా

భక్తియను కట్టుగట్టి చందమామా

పామును యుక్తిజేసి కట్టవలెను చందమామా

దేహీదేహముల సందు చందమామా

పాము తెలియకుండ చుట్టుకొన్నది చందమామా

అజపమంత్రధ్యానముచేత చందమామా

పాము అఖండ ఖళలతో వెలుగుచుండు చందమామా

పామునుబట్టుజోగిరెవరె చందమామా

ఓహో! అతని పేరే సిద్ధగురుడు చందమామా

పిమ్మట అక్కడ చేరిన భక్తులకందరికి ప్రసాద పంచామృతము లను పంచి పెట్టవలెను. అటుతర్వాత ఈక్రింద కవిన పాటలను భక్తులు పాడవలెను. ఈపాటలు అమరనారాయణ శతకము నుండి కొన్ని. వీరబ్రహ్మేంద్ర స్వాములవారి కాలజ్ఞానం నుండి కొన్ని తీసికొనబడినవి. వీటిని కంఠోపాటము చేసి జనులు తీరిక యున్నప్పుడు పాడుకొనుచు, సారమును గ్రహించి, తద్విధముగ జీవితంలో నడచుకొన వలసినదిగా మనవి.

జీవా! నీవిధికానవా
నీ వుండేటి యింటి మర్మము తెరుగవా
ఆ యిల్లు పాడుజేసి వెల్లె వేళవచ్చె
ఇప్పుడైననుగాని యిల్లు శోధించరాదా ॥జీవా॥

తొమ్మిదీ వాకిండ్ల కొంప — దుఃఖములకిది మూలదుంప
ఎంచితే కలగూరగంప — తెలుసుకోవోసీ పాడుకొంప
డెబ్బదీ రెండువేలనాళ్ళు — అరువదీ తొమ్మిది కీళ్ళు
తోకపురుగులు మూడుపాళ్ళు — నిండివున్నది నీచునీళ్ళు ॥జీవా॥

మలమూత్రముల కుంట — మాంసపునెత్తురు పెంట
మురికిప్రేగుల ముద్దజంట — కూడినడుమల కీవితుంట
నచ్చునరముల బొచ్చుతొట్టి — నమ్మరాదిది గాలిబుర్ర
ఎఱుగవా యీ మేనిజట్టి — ఎంతజెప్పిన వినవువెఱ్ఱి ॥జీవా॥

బ్రహ్మనిర్మితమైన కొట్టం — ఇరిగిపడితె యేమినష్టం
కానవా యిదికాటికష్టం — దీనికెందుకు యింత ఖీష్టం
మూరెడు బెత్తెడు ఎముక — దొంతికుండలదోవగానక
పెద్దపులులను మూటజంపక — ముక్తుడయ్యేదెట్లు కొడకా ॥జీవా॥
గూడువునికి జేసిపొంచి - భూతములను సంహరించి
హంసమార్గము సంచరించి-అమరనారాయణుని పూజించు ॥జీవా॥

కనలేవురా ! నరుడా ! కనలేవురా!
ఈ కలిమాయలోనా బడాబోకురా ॥కన॥
ఆలిపొందున అర్థభాగము—గడచిపోవును నిద్రలోనా
భ్రాంతిజూపరు కన్నబిడ్డలు—తోడురారు బంధుమిత్రులు
జీవితంబున అర్థభాగము—గడచిపోవును నిద్రలోనా
చిత్తబుద్ధి నిలుపలేక—తరగిపోవును అర్థభాగము ॥కన॥

మేను నేనేనన్నది—నీస్వార్థమే మనుచున్నది
మేను ఏమో బంకమట్టి—స్వార్థమే మో ఉప్పుతొట్టి ॥కన॥
దేవుడందువు దేవతందువు—పూజలెన్నియొ సేయుచుందువు
కన్నవారి ఋణము మరచి—కలతలెన్నియొ చెందుచుందువు
పెంచి పెద్దచేసి పది—మాసములు నిను మోసినాక
కన్నతల్లితండ్రు లెవ్వరు—కానరారు యౌవనంబున ॥కన॥
భోగభాగ్యము కల్లరా—జగమెల్ల యిదిఒక మాయరా
మాట యివ్వబోకురా—మరి అడితప్పనూకురా
భక్తి మనసులోవున్నది—నీవ్రాత మాన్పగనున్నది
కామక్రోధమువలదురా—మరి అడితప్పబోకురా ॥కన॥

3. చింతలన్నియు విడచి శ్రీగురునివేళ చింతచేయవె మనసా
చింత జేసినపుడె సిద్ధించు పరమపదవి శీఘ్రము తెలియవె మనసా
చచ్చు వారినిజూచి వచ్చువారినిజూచి మత్సరంబేటకే మనసా
బహుపాపములుచేసి యమబాధపడనేల బాటచక్కకచూడు మనసా
నాల్గుయుగములు వేయినాన్నూరు గడచినా పుట్టుపోకలులేవె మనసా
నీటిమీద బుగ్గ నిలుచునా యీ తనువు నినునీవు తెలియవె మనసా
ఆలు బిడ్డలు అధికబలమైన సంకెళ్ళు అంటి అంటకవుండెమనసా
మరులు మా మాశక్తి తనువును మర్దించి మాయ గెలుచుట మేలుమనసా
ధనధాన్య పశు పంచలోహాలోక భ్రమలు తెగటార్చవే మనసా
ఆదిమూలములోను ఆత్మారాముల పూజ అనుదినముసేయవెమనసా
తగలుడిగి పరతత్త్వ సంధానమున యోగసాధనముసేయవెమనసా
ఎఱుకకన్నా దేవుడెందూ వెదకిన లేడు ఎఱుక నిన్నురక్షించుమనసా
ఎఱుకకై వరపురము అమరనారాయణ వేదాంత వేద్యుడే మనసా

చిల్లర రాళ్ళకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడునుర ఒరేఒరే
చిత్తమునందు చిన్మయజ్యోతిని చూచుచునుండుట సరేసరే
ఒక్కప్రొద్దులని ఎండుచునుంటె ఒనరుగ చెడుదువు ఒరేఒరే
ఏకమైనయావై భవమూర్తిని చూచుచునుండుట సరేసరే
నీళ్ళలో మునిగి గొణుగుచు నుంటె నిలకడచెడునుర ఒరేఒరే
నీళ్ళలో నుండె నిర్మలజ్యోతిని చూచుచునుండుట సరేసరే
బాధగురువుల పంచను చేరితే భావము చెడునుర ఒరేఒరే
మనమునందున బ్రహ్మకాంతిని చూచుచునుండుట సరేసరే
భూములు అడవులు తిరుగుచునుంటే బుద్ధులుచెడునుర ఒరేఒరే
బుద్ధిలో యుండే పున్నమి చంద్రుని చూచుచునుండుట సరేసరే
వీరయ్యచెప్పిన వాక్కును నమ్మితే వివరముతెలియుర ఒరేఒరే
వివరమందుండె విగ్రహమూర్తిని చూచుచునుండుట సరేసరే

ఇల్లువాకిలినాది ఇల్లాలునాదనుచు ఏలభ్రమసితివయ్యో మనసా
కాలుని వలలోను చావనుచిక్కితివి కడతేరుచేత్రోవ మనసా
తనయులు చుట్టములు తనవారని నమ్మి తలపోయకె వెర్రి మనసా
తనువువిడిచివెళ్ళు సమయంబులోపల తనవెంట రారైరి మనసా
ఆరుమూడిట జేరి ఆపత్తేజముగని అందముగనుగొనవె మనసా
మేటిస్థానములోన మేటిస్థానమునందు సూటితప్పకచూడు మనసా
వాటముగా బింబము తేటగా కనపడును తెలివిగలిగిబ్రతుకు మనసా
సత్తుచిత్తులరెంటి సారంబు కనుకొన్న పారవిడుచునేమొ మనసా
సంసారివైనీవు హాతికన్నుగొన్నను హింసలుతొలగునే మనసా
రూపుచూపులు లేని ఖేచరమ్మును జూచి దాపుచేరవే వెర్రిమనసా
పాపను మేల్కాంచి బయ్యలును తెలిసికొని గోప్యముగలదినీకు మనసా
అంటిఅంటనిపండు ఆరింట వెల్గుచున్నది యింటిలోనున్నదె మన సా
ఒంటిగా యాగంటివాసుని మదిలోన జంట బాయకన్నుండు మనసా

6. దేవుడు తనలో దండిగనుండగ తెలియదు మానవ పశువులకు
సంశయముడుగక సద్గతి చేరక సర్వముతానని తెలియవలెన్
సర్వముతానని తెలిసేటందుకు గురూపదేశం కలగవలెన్
గురూపదేశం కలిగేటందుకు నిలకడగా మతి నిల్పవలెన్
నిలకడగా మతి నిలిపేటందుకు విరసము విడువక తెలియవలెన్
విరసమువిడిచి చిత్సమాధిలో నున్నతముగ తానుండవలెన్
ఉన్నతముగ తానుండేటందుకు తారాక్షణముగగురితగులవలెన్
తారాక్షణముగ గురి తగిలేటందుకు ఉచ్ఛ్వాసంబులు నిలుపవలెన్
ఉచ్ఛ్వాసంబులు నిలిపేటందుకు సాధకమున సాధించవలెన్
సాధకమున సాధించేటందుకు ఏకాంతమున చేరవలెన్
ఏంకాంతంబున వుండేటందుకు సంసారస్థితులుడుగనలెన్
సంసారస్థితులుడిగేటందుకు దేవుని కృపతా కలుగవలెన్
దేవుని కృపతా కలిగేటందుకు ఎఱుక కలిగితానుండవలెన్
ఎఱుకగలిగితే యాగంటీశుల మరుగున జేరుక నుండవలెన్
మరుగు జేరుకొని మరియానందము మహిలోపొందుచు నుండవలెన్

7. శ్రీనివాసుని సేవజేసే సిద్ధులెవ్వరె అక్కరో
పూని సద్గురు సేవజేసే పుణ్యులేనే చెల్లెలా
గురుతుగా గురుసేవజేసే గుణులెవ్వరె అక్కరో
మరుజన్మములేని మహనీయులె చెల్లెలా
మహనీయులచేవారి మతమేమె అక్కరో
ఇహములో మానాభిమానం విడిచిందే చెల్లెలా
మంచిదైతే వారికే ప్రపంచమందే మక్కరో
సంచితమూలమందే నమసిపోవునె చెల్లెలా
ఎంచరాని సంచితాలవి ఎట్లుపోవునక్కరో
మంచి సద్గురు సేవచే కృసించిపోవునె చెల్లెలా

దేవుడున్న తావుమాకు తెల్పగదవె అక్కరో
నీవునీలో చూపుచూచి నిండియుండు చెల్లెలా
నిండియున్న తావుచేరే నిక్కడేమే అక్కరో
దండిగా త్రికూటముపై దారిచూడేచెల్లెలా
అందుపైన దారిచూపే ముద్ర ఏదో అక్కరో
భద్రమైనా శాంభవీ చిన్ముద్రగాదటె చెల్లెలా
శ్రీభద్రమైన ముద్రలోన శశిభానుడేమొ అక్కరో
ముద్రభావముగాని ముక్తికి మూలమదేచెల్లెలా
స్థిరముగాను ముక్తిదెల్పే సరళిపదో అక్కరో
ఆరుమూడు వీడగానె అబ్బునేనె చెల్లెలా
మూడుమూడుమూడువీడె మూలమేదో అక్కరో
జోడుబాయని హంసగూడె జాడగాదటె చెల్లెలా
ఖ్యాతిగా భ్రూమధ్యమందున జాతరేమే అక్కరో
జాతరే ముమూర్తులున్నా జ్యోతిరూపమె చెల్లెలా
జ్యోతిలోను ముఖ్యమందేనాతి ఎవ్వరె అక్కరో
నాతియే గిరిశాంభవీ గురుమాతగాదటె చెల్లెలా

8. ఈ జన్మమిక దుర్లభమురా ఓరి సౌజన్యసాకార సద్గురునిగనరా ॥ఈ
పంచాక్షరీమంత్ర పఠనచేయన్న—పఠనచేసితె యముడు పారిపోనన్న
పారిపోతె అంబఫలమిచ్చునన్న—ఫలమునందినవాడు పరమగురుడన్న
మూడారు వాకిళ్ళుమూయవలెనన్న—ముక్తివాకిటనిలచి తలుపుతీయన్న
తలుపుతీసితె అంబతేజ మిచ్చన్న—తేజమందినవాడు తాగురుడోయన్న
ఆరునిధులమీద అంబవుందన్న—అంబలో దుర్గాంబ ఆట్లాడునన్న
ఆట్లాటలో మంచి అర్థముందన్న—అర్థమెరిగినవాడు హరిగురుడోయన్న
నాళికములో దృష్టినడిపించుమన్న—నడిపించిమరినీవు నమ్మియుండన్న

నమ్మి నవరత్నముల పీఠమెక్కన్న—పీఠమెక్కినయంబపిలుచునోయన్న
పిలిచినంతనీవు నిలుచుండుమన్న—నిలిచినంతనీవు నిజగురుడోయన్న
జంటకోవులు రెండు అంటివూదన్న - అంటిమేన్మరచి యట్టెనిలుపన్న
మేనుమరచి ఘంటనాదమినుమన్న—నాదమినిపోతుఋారిని
నమ్మియుండన్న

9. గురూపదేశమైనందుకు దుర్గుణములు మానిందెలుకా
మరువక సద్గురు మంత్రములోపల మర్మము తెలిసిందెలుకా
తారకబ్రహ్మము తనలోనుండే దారితెలిసిందెలుకా
వారకాంతలను జూచి తల్లిగా వర్ణనజేసిందెలుకా
ఇరువైయైదు తత్త్వము లోపల హితవుదెలిసిన దెలుకా
కుజనులతో రాజ్యంసేయక రాముని దలచే దెలుకా
మతభేదములు సేయక తనలో మంకువగనినాదెలుకా
మతములకావల వెలుగుచునుండే మాహాత్మ్యముగనినా దెలుకా
సరసత్వరంబుగ సాధుజనులతో వాదులుసేయని దెలుకా
మనోబుద్ధి చిత్తాహంకారములు మఱచియుండిన దెలుకా
పాశబంధముల పట్టుబడక పరమాత్మను గలిసిందెలుకా
వాసిగనాసర దయతో హెూబల దాసుకు తెలిసిందెలుకా

ఓం శాంతిః శాంతిః శాంతిః



చిత్తూరు జిల్లా సహకార ముద్రాక్షరశాల, చిత్తూరు ఫోన్ : 2668.